# మొదటి కూర్పు

ఇప్పటి యీ కలి మహా యుగములో నవనాగరికత, మనఃపరిశ్రమము, హెచ్చిన కొలది ఆయురారోగ్యములు మట్టుపడుచున్నవి.

ఈచిన్న పొత్తమునందు కలిద్వాపర యుగములలోని కొందఱు మంచి బుద్ధిశాలుర కుశాగ్రబుద్ధి నైపుణ్యమును, ప్రజ్ఞావిశేషములను దెలుపు చర్య సంగ్రహముగ విశదపరచియున్నాను. ఆయా వ్యాపారములలోనుండు సమస్త సంసారులకు వారి వారి జీవయాత్రలలో సాధకములకు బాధకములును, బాధకములకు సాధకములును సంఘటించుట సహజమయి యున్నది. ఇవి కొన్ని పౌరుషములు. ఇందు నిర్బాధకమైన సాధకములచేత కృతకృత్యులగుటకే వీరి పరమావధి. ఇందుకై యీలిక్కు-కిలక్కు అను గ్రంథము సిద్ధపరచితిని. గుణగ్రహణపారీణులు దీని మన్నింతురుగాక.

మనుజుడు కించజ్ఞుడు, పూర్ణతలేనివాడుగాన లోపములను గౌరవముతోను వాత్సల్యముతోను దెలిపిన శిష్యభావముతో గ్రహించెద.

ప్రస్తావవశమున వీరబల వినోదములలోని కొన్ని సంగతులిందు సూచించుటచేత దాని సంగ్రహించిన బ్ర॥శ్రీ॥ కొత్తపల్లి సూర్యారావుగారికిని, క్లయివుయొక్క కథ వ్రాయుటలో కొన్ని సంగతులకు "హిందూదేశ చరిత్రకథలు," "హిందూదేశ చరిత్రము" రచించిన మ॥ శ్రీ॥ కే. ఏ. వీరరాఘవాచార్యులు బి. ఏ. గారికిని నా కృతజ్ఞతావందనములు.

పవరుపేట, యేలూరు.
ఆ 1913 సం॥ మే నెల.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
పెద్దాడ చిట్టిరామయ్య.

---

## రెండవ కూర్పునకు పీఠిక.

మొదటి కూర్పు తా॥ వేయుప్రతులారుమాసములలో వ్యయపడినందున నీ గ్రంథము రెండవకూర్పు రెండువేల ప్రతులు తిరిగి ముద్రింపించి ప్రకటించనైనది.

పవరుపేట, యేలూరు.
ఆ 1918 సం॥ నవంబరు.

ఇట్లు బుధజనవిధేయుఁడు,
పెద్దాడ చిట్టిరామయ్య.

# శ్రీరస్తు.

# లిక్కికి లిక్కి.

ఈమహావాక్యమునకు బదులుగ మనయాంగ్లేయులు టిట్ ఫర్ ట్యాట్ (Tit for Tat) అనువచనమును వాడుదురు. దీనికి బ్రతిపదము (Tip for Tap) టిప్ ఫర్ ట్యాప్ కలదని ఛేంబర్స్ నైఘంటికుడు తన యిరువదియవశతమానపు నిఘంటువునందు వ్రాసి దీనియర్థము (Blow for blow) గుద్దుకు గుద్దు అని వ్రాసెను. గుద్దుకు గుద్దు అనగ తనను మఱియొకఁడు గుద్దితే తిరిగి వానికి శాస్తిగా వానిని మగలగుద్దుట. ఆంధ్రదేశమున లిక్కికి లిక్కి యను సామెతకు తిట్టుకు దెబ్బ యనుమఱియొక ప్రతివచనము కలదు. తిట్టైతేని దెబ్బతీయుమని దీనియర్థము. ఇట్లు తిట్టు పడినవాడు మూగవాడు, శాంతుడు, బలహీనుడు లేక యబలుఁడయియున్నచోఁ బ్రతిహతముగ దెబ్బఁ దీయఁ జాలడు. సామెతయొక్క ఆచరణ (అమలు) నడుచుటలేదు. తిట్టుతినినవాఁడు శాంతుఁడు కాని సామాన్యుడు బలవంతుఁడయ్యేనేని దెబ్బవేయనూ వచ్చును. సామెత నిశ్చయుండనూవచ్చును. 'టిట్ ఫర్ ట్యాట్' అను సామెతలో నీ ప్రకారము గుద్దుకుబదులుగ గుద్దువేయుట సహజమయి యుండును. అయితే యిప్పుడు వివరించిన రెండువిధములగు వర్థము లెస్సనైన యర్థము కాదు. అది వాచ్యార్థము (literal meaning) పోలీసు నౌకర్లయెదుటగాని బహిరంగముగు కచ్చేరీలలోగాని, గూయారివిన్యూ, సర్వే, శివిల్ మొదలగుశాఖల యుద్యోగస్థుల యెదుటగాని యట్టి ప్రతిహతములు యథేచ్ఛగా నడవఁజాలవు. అట్టి సంగతులలో పగదీర్చుకొనవలసిన వాని పగదీరక లోలోపలనే స్వయంపాకము చేయుచు మఱియొక లాగున ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని, హాని, కీడు, నష్టము, లేక ప్రతిహతము సల్పి పగఁదీర్చుకొనును.

ఒకప్పుడు వర్తకముచేయు నొక సంఘమువారు కాయం ఉద్యోగస్థులను లోబరచుకొని తమకు సంబంధపడిన సరకులకు హీనమగు పన్ను పడునట్లుఁ జేసిరి. ప్రతికక్షులీ యక్రమమునకు నోర్వఁజాలక పయి సర్వాధికారి న్యాయముంచి యన్ని విధముల సరకులమీఁద నేర్పడియుండు అసలు కాయము (ఇప్పటిటోల్ గేటు) పన్నునే

తమామూలొట్టిపేయించుకొనిరి. సరిగా నిట్టిమోస్తరు చర్య బంగాళా నవాబు మీరు కా
సీము కాలములో జరిగినట్లు మన హిందూదేశచరిత్ర పాఠకులందరకుం దెలియును. ఇంత
కంటె ప్రబలమైనట్టియు ప్రత్యక్షమయినట్టి ప్రస్తుతమున ఆచరణలోనున్నట్టియు మతి
యొకదృష్టాంతము చూపెదను. ఎ అనువంట చరకుకంట్రాక్టరు తన తాలూకు వందలకొ
లది కలపబండ్ల సరకును ఏక్సనునొక మునిసిపాలిటీ పట్టణములోచేర్చి విక్రయించి లాభ
ము నొందుచుండును. ఇతడే తనలాభమును, స్వప్రయోజనమును తలపోయుచు పరులకు
పాయముంకుచింతింపక నొకపర్యాయము ఒకనందబండ్లతో వంటకల్ప రోడ్డుమార్గమున
నడవినుండి తెప్పించి టోల్ గేటువద్ద నిల్పి బలమయిన యెద్దులుగల అయిదుబండ్లకుమాత్ర
ము నిర్ణీతమగు టోల్ గేటుపన్ను చెల్లించి తక్కినవాటిని హద్దు వెలపల రోడ్డుమీదనా
పి చీటిపొందిన అయిదుబండ్లవాండ్రచేతం బట్టణములోనికి తనమిగతాసరుకును మోయింప
సాగెను. ఈపన్నాగముచేత గేటుపన్ను లేక సుంకము దగ్గిపోవుచున్నదని కనలి గేటు
కంట్రాక్టరు రెండుమూడు పర్యాయములు సరుకు మోయుచు దిరుగు లాడు చున్న బం
డ్ల వారిని అటకాయించెను. సరియయిన చీట్లు పొందినవారు కాబట్టి 24 గంటలకాల
ములో నెన్నిసార్లు గేటు దాటినను మరల సుంకము వసూలుచేయగూడదను నిబంధనను
బట్టి ధిమాకుచేత గేటువారి అటకాయింపులకు బెదరక వాళ్ళను ధిక్కరించి కలప కం
ట్రాక్టరు తన పని సాగించుకొనెను. ఈపాయాంతరములోచక ఏమిగతిరాయని యా
లోచింపుచుండగ గేటు యిజారదారుని కొక బుద్ధిమంతుడు రోడ్డు సీహద్దుకు నవతల
యున్నను అది లోకల్ ఫండు వారిదగనుకను, రోడ్డుమీద నడచు బండ్లు, మనుష్యులు,
సరకులు రాకపోకలకు నవరోధముగా నిలుపుట నేరముగనుకను, యీవార్తలోకల్ ఫం
డుడోద్యోగస్థులకు రిపోర్టు సేయమనెను. సరేయని గేటుకంట్రాక్టరిట్లుచేయగ స్థల స్వపా
లనాధికార్లు బండ్లునిలిపి యుంచినందుకు నక్షీయోగముంటెచ్చెదమని బెదరించిరి. అందు
కై యుపాయమేమియని కలపకర్తనడు విచారింపుచుండగ నొకకరణము కలపవర్తకు
నతో నిట్లు బోధించెను—ఈయుపాయము దప్పించుకొనుట కొక యుపాయముగలదు
రోడ్డుప్రక్కను ఎగువునఖల్లాంగు దూరమున చిరకాలముండి పొలములలోనికి సరకు
లు పెంట బండ్లమీద రాకపోకల నిమిత్తమొక స్లోపుగలదు. అచ్చట దరిశేద్యగాని
పొలములలో నొకరూపాయ కలబాడుగతో నీకు నెలకో జులవరకు నిల్చుటకు స్థలము దొరి
కును. ఆచోటున నీబళ్ళు, నీమనుష్యులు, సరకులు, పశువులు సురక్షితముగ నుండవచ్చు
ను. నీవ్యాపారము హెకమతుగ సాగించుకొనవచ్చును. అనగవిని సంతోషముతో కలప

కంట్రాక్టరు పొలముకాపునకు సెలబాడుగ యిచ్చి లోకల్ ఫండుద్యోగస్థులు బెదరించిన వెంటనే తనసరకుబండ్లను ఖాళీబండ్లను అడ్డపొలములోనికి యీడ్పించుకొనిపోయి పయినవి వివరించిన రీతిని వంటచెరుకు యావత్తు పట్టణములోనికి పోయించి తనపట్టు నెగ్గించుకొ నెను.

పయినవివరించిన రోడ్డు స్లోపు చిరకాలభుక్తై లోకల్ఫండధికారుల వ్రాతమూ లమయిన శాంక్షను అయియుంటేనే కల్పకంట్రాక్టరు పట్టు నెగ్గునుగాని లేకపోతే చిర కాలభుక్తమున్నను రయితు స్లోపును సంరక్షించుకొనజాలడు.

ఈరెండు దృష్టాంతములలో నొకడు తనలాభమునకై పరుని నష్టమునకయి ప న్నిన పన్నుగడయె టిక్కు" ఇది ఎదుటికక్షిదారునకు నపాయమయ్యెను. దానిని దాటు టకు ప్రతిహతముగ విరోధిచేత పన్నబడిన యుపాయమెయాటిక్కుకి 'టక్కు' యయిన ది. ఇంతవరకే సామెత పూర్వోత్తరము తెలిసినది.

## టిక్కుకి 'టక్కు' నిర్వచనము.

ఒకరినొకరు స్వలాభమునకయి పరులను నష్టపరచి యుపయోగించు నపాయము నకు నపాయము, లేక యుపాయమునకు నపాయము 'టిక్కుకి టక్కు' యనందగు.

ఇట్టి లక్ష్యార్థమును విడిచి 'గుద్దుకుగుద్దువేయుట' 'తిట్టుకు దెబ్బవేయుట' యని సరియని వాదించేయెడల ఈక్రింది యవరోధము తటస్థించును.

ఏయనువారను తిట్టినతిట్టుకు బీరొట్టినదెబ్బ నొవ్వతగిలి ఏ మరింతకనలి బీమీదక తినమయిన దెబ్బవేసినయెడల లేక సమ్మెటపెట్టు వంటిగుద్దువేసినయెడల "నవ్వులుపూవు లాయెను"నుసామెతనుబట్టియును తిట్లాటలోనుండి కొట్లాటలోకిదిగిరి "From words they came to blows." అను వాంగ్లేయవచనముంబట్టి యును దెబ్బలాటలో దిగి తుదకు ప్రాణాపాయకరమగు హింసచేయుదురు, లేక పొందుదురు. అపుడు రాజభటు లపారై దావాముద్దాయీలు రాజశాసనప్రకారము శిరచ్ఛేదనమొదలగు శిక్షార్హులగుదురు

కాబట్టి యీవిషయమైనసామెతకు వైరకము నేరములు చెందవు. బహిరంగము లోబడక చీకటిలో రాళ్ళు రువ్వివరీతిగదనకు గలపగ మనస్సులోబెట్టికొను మధ్యరక ములోచేరిన సామాన్యజనులకె యీసామెత చెల్లుచున్నది. వీరిలో చాలామంది ధూర్తులు గలరు. ధూర్తుడెట్టివాడో వానిలక్షణములు తెలిసికొనుడు. శ్లో॥ ముఖంపద్మ

కారం వాచశ్చందన శీతలం ; హృదయం కర్తరీ సంయుక్తం అతి వినయం ధూర్త లక్షణం ॥ ఇట్టి వారి మనో వాక్కాయములనెడు త్రికరణముల వ్యాపారములు చిత్రగతులు గలవి. వీరు మనస్సునం దొకటి తలచి వేరొకటి చెప్పుదురు. చెప్పుదానికి మరొక లాగున పని చేయుదురు. ఒకడు తాను విధిగా జేయవలసిన పని మానివేసినను చేయగూడనిది చేసినను లేక యుదాసీనుడయి యూరకయున్నను అనగా తటస్థుడుగానున్నను ఇతరులకు హాని, నష్టము, కష్టము, అనిష్టము అరిష్టము సంభవించును. 'పిల్లికి చెలగాట ఎలుకకు ప్రాణపోకట' యన్నట్లు తనకాయాచేష్టలు మనోహరములయి యున్నను బరులకు నపాయకరములయి యుండును.

'లెక్కకి లెక్క' యను సామెత ప్రకారము పన్నగముచే యీ రాజకుటుంబము లో రెండు తెగలవారు 'జ్ఞాతిహుతాశనుండు' అను భర్తృహరి వచన ప్రకారమొక రియం దొకరికి నసూయత, తగనిపోటి, హెచ్చు ప్రాణాపాయకరమయిన యుద్ధముల లో ప్రాణములు విడుచు సమయములో నయిత మీ 'లెక్కలెక్కలే' తరణమలని తలంచి తుదకు తమ యాశాపాశమును, లోభమును బ్రకటించి లోకాంతరమును బొందుదురు. దుర్యోధనుడు పదునెనిమిది దినములు పాండవులతో యుద్ధముచేసి తన సోదర బంధు మిత్రులను బోగొట్టుకొని యపజయమంది ప్రాణములు వదలునపుడు సయితము యీలెక్కనే వెదకుచు దానగదాయుద్ధములో న్నో డితొడలు విరిగిపడియున్నను తాను పట్టినపట్టును, పన్నాగమును, విశ్వజాలక శ్రీకృష్ణభగవానులతో దనలో నాశాపాశము లతో చుట్టబడియున్న మూడు అభిలాషలను వెళ్ళగక్కెవానికి విరుగుడు అనగా పూర్వపక్షములువిని నిరాశుడయి విగతాసుడాయెను, అనగా ప్రాణములువదలెను.

చదువరులారా! లెక్కలెక్కల మహాత్మ్యమెంతెంతో తెలిసికొనుటకు క్రింది సంవాదమును చదువుడు. లక్ష్యములో నుంచుడు.

## శ్రీకృష్ణ దుర్యోధనుల సంవాదము.

దుర్యోధనుడు—శ్రీకృష్ణా జయము నొందుటకు నింకనునాకు మూడభిలాషలు గలవు.

కృష్ణమూర్తి—అవినిరూపించి ఒక్కొక్కటిగఁ జెప్పుము.

దుర్యోధనుడు—మరణాయాసముతో గొండ్రించుచూ హస్తినాపురమునకు శత్రువులకజేయమును, దుర్గమమును నగు కోటనొకటి కట్టించవలెననియున్నది.

శ్రీకృష్ణస్వామి—అట్లయినయెడల నకులుని గుఱ్ఱము నెక్కించియతనిచేత పాండవసైన్యము నశేషముగా గోటలోనికి దింపి యుద్ధము జరిపించగలను. నీవును నీసేనలును నాశమునొందగలరు.

షరా—నకులునకంతశక్తి యేలవచ్చెనని పాఠకులను కొందురు. అప్పటి ద్వాపర యుగధర్మమునుబట్టి తపోమహిమ భావనాశక్తి హెచ్చుగనుండెడివి. అశ్వశాస్త్రప్రవీణుడగు నకులుడొక వర్షదినమందు జినుకులసందునుండి గుఱ్ఱమునునడిపించి తడియకుండ శ్రీకృష్ణునిమందిరము జేరెను. అది కృష్ణుండుచూచి నకులుని యశ్వవిద్యా ప్రవీణతకు నచ్చెరువంది 'ఇకనా సెలవులేనిది గుఱ్ఱమునెక్కితివా తక్షణము చచ్చెదవుగాక' అని నకులునిశపియించెను. అందుకు గనలి 'నేను మృతినొందిన తక్షణమే నీవును మృతినొందుదువు గాక' అని నకులుడు ప్రతిశాపమిచ్చెను.

దుర్యోధనుని రెండవయభిలాష—విదురునిచేత విల్లుపట్టించి యుద్ధముచేయించి గెల్పొందుదును.

కృష్ణమూర్తి—విదురుడు విల్లుపట్టినయెడల నేను చక్రము చేతబట్టి నిన్నును నీవారినందఱి నంతమొందింతును.

దుర్యోధనుని మూడవయపేక్ష—అశ్వత్థామకు సర్వసేనాధిపత్యమిచ్చి శత్రుజయమందెదను.

శ్రీకృష్ణునియుత్తరము—అశ్వత్థామయే సర్వసేనాధిపతియై సేననునడిపించెయెడల ధర్మరాజునకు గోపముపుట్టించి యేనుగునెక్కింతును.

ఇట్లు తనమూడుమనోరథములు విఫలములు కాగానే దుర్యోధనుడు ప్రాణమును విడిచెను. తీవ్రమైనట్టి మరణావస్థ యందుపాయములకు నుపాయమును, ఆపాయమునకు నపాయములు అవలీలగా పన్నుటకు శ్రీకృష్ణ భగవానునివంటి మహాపురుషులకే చెల్లునుగాని యితరులకుం జెల్లునా?

మీదవివరించిన దుర్యోధనాదులగు రాజకుటుంబమువారికి ఈర్ష్య, జగీష, అధికారేచ్ఛ, దరిద్రాశ, స్వప్రయోజన పర్వతము. అసహనముమొదలగు దుర్గుణములు లోబడి యుండగ, మధ్యతరగతిలోనున్న సామాన్యజనులట్టి దుర్గుణములకు దాసులై యున్నారనుటకు నాశ్చర్యమేల?

మీదవివరించిన కృష్ణదుర్యోధన సంవాదానంతరము సృష్టిలో నుత్తమజంతువగు మనుజుడు (మనుబ్రహ్మనుండి జనించినవాడు కాగా మనుజుడు) అపాయయుపాయకల్పనాశక్తియందు మిక్కిలి ప్రబలియున్నాడు. ఈప్రాబల్యము ఏరీతున హెచ్చినదో ఈక్రింది విధముగ దెలిసికొనవచ్చును.

ద్వాపరయుగాంతరమందు కురుపాండవయుద్ధము జరిగెను. నేటికి కలియుగము ప్రారంభమై 5014 సం॥ లయినవి. ఈ కురుపాండవయుద్ధము గడిచిన ద్వాపరాంతము అనగా కలియుగాది యందు. పయి యుద్ధమునకు వచ్చిన బంట్లు 18 అక్షౌహిణులనగా 18 × 109350=1968300 లే అనగ సుమారు ఇరువది లక్షలుగ నెంచవచ్చును. వారు యుద్ధమున నశించిరిగాని దేశమునవిల్చిన ప్రజ 5 రెట్లకు మించి యుండదు. అనగా ద్వాపరాంతమున భరతఖండములో సుమారు కోటిమందిజనులు వసించిరి. అది మొదటి హిందూ మహాయుగములోను మహమ్మదీయ హిందూ మహాయుగములోను పోరులు కల్లలు, ఓగ్వ్లేమి హెచ్చి దేశమునకు స్వస్థతలేక ప్రజాభివృద్ధి విషయమయి తలచిన వారేలేరు. 18 వ శతాబ్దమధ్యము నకు నేటికి 150, 160 సం॥ నుండి బ్రిటీషు యా ప్రభుత్వ మారంభమునప్రబలినది మొదలు ప్రజాసంఖ్యాభివృద్ధివిషయము విచారణలోనికి వచ్చెను. నాబాల్యదశయందు 1850 సం॥ రమనగ 19 వ శతాబ్దమధ్యమున అప్పటి లెక్కకమిటీ భూగోళప్రకారము ఇండ్యాజనాభా 14 కోట్లు. అయితే ఇప్పటి 1911 సం॥ ప్రజాగణితి ప్రకారము మనదేశప్రజలు సుమారు 31 కోట్లు. ఇందువలన భరతఖండజనాభాయభివృద్ధి దేశాభివృద్ధి దేశముయొక్క యౌన్నత్యము ఏయేరీతున హెచ్చినవో యూహింపవచ్చును. ప్రస్తుతవిషయమగు బుద్ధిశక్తులు మనుష్యులయందెన్ని మడుగులు హెచ్చినవో తెలియుట నేయున్నది.

ప్రస్తుతవిషయమయి లక్ష్యములుగ దృష్టాంతములు విస్తారముగ వివరింపబడును. తనకుటుంబవృద్ధికై సంరక్షణముకై సంసారి రాత్రింబగళ్లు దేహమనోశక్తులను వినియోగపరచుచు నేయుండును. ‘సంసారికి ఉన్నదితృప్తి పశువుకు తిన్నదితృప్తి’ యన్నట్లుతనకు నెంతకలిమి యున్నను తృప్తిలేక మరింత సంపాదించుటకు ప్రయత్నించును. ఇట్టిసంసారులలో ఘటికులు కార్యసాధకత్వమునే తమ పరమావధిగా నెంచి సౌందర్యాని కడగండ్లను కష్టములను పొందుచున్నారు. ఇట్టివారు పట్టియుక్తులను ఇట్టిమాటలనేగక తమ తమ నడవళ్ళ చేత తమసంకల్పములను నెరవేర్చి లోకమున తమ కీర్తిశరీరములను చిరంజీవులుగ విడిచిపోవుచున్నారు.

ఈక్రింద వివరించిన యిట్టిమహాపురుషుల యుపాఖ్యానములు.

## 1. మొదటిది కాళిదాసుని చాటుకథ.

భరతఖండమున భోజమహారాజు పరిపాలించునపుడొకతరి ద్యూత మందును స్త్రీలోలతయందును చిక్కికొన్నవాడయి కొన్ని నెలలు మహారాజకార్యములు జరుప నందున మంత్రిపురోహితులు ఆస్థానకవులు వీకీవేసరి రాజుసరియయిన మార్గమునందు యెట్లు సంచరించునో యని విచారించుచుండగ నొకనాడు ఆస్థానకవియగు కాళిదాసు సన్యాసివేషము వేసికొని యొకకాసాయి దుకాణమునందు మాంసపుకండను చేతబట్టి బేరమాడుచున్నట్లు నటించెను. ఆదారినేబోవుచు అదిచూచి:—

### భోజరాజు, భిక్షుకుల సంవాదము.

భోజమహారాజు—ఓ సన్యాసి మాంసముభుజించుట నీకు తగినపనియా?

భిక్షుకుండు—మహారాజా మాంస మొక్కటియైతే నేమి ప్రయోజనము? సారాతోకూడ దాని నుపయోగింతును.

మహారాజు—తమకు సారాకూడ రుచికరమా?

భిక్షుకుడు—ఒకసారాయేనా భోగముదికూడ నుండవలెను.

మహారాజు—భోగముదానినుంచుకొంటె తమకు ధనముకావలెకదా? అదెట్లు సంపాదింతురు?

భిక్షుకుండు—అయోగ్యధనమెట్లు తెత్తునను కొనుచున్నారు? ద్యూతము, అంతప్పితే దొంగతనముచేసి సంపాదింతును.

మహారాజు—తమకుద్యూత చౌర్యములందుకూడ పరిచయముకలదా?

భిక్షుకుండు—ఓ మహారాజా—'చెడ్డకాపురమునకు కుళ్ళేమి?' అన్నట్లు నావంటి కాముకులు జూదరులగు భ్రష్టులకు ఇదేగతికదా?

అనగాచేరాజు తనతప్పును గ్రహించి తనకు యీవిధముగ మందలించి బుద్ధిగరపుటకు చేసిన నటనమున కచ్చెరువంది కాళిదాసుని శ్లాఘించి పూర్వమువలె ప్రవర్తించెను.

## ఫలితార్థ

కాళిదాసు పరోక్షముగా నిట్టికవముతో చెప్పినబుద్ధి లోకోత్తరమైనది రాజ్యమునకు గొప్పమేలుచేసినది. ఇదియొకాళిదాసు ప్రజ్ఞావిశేషమును చతురతను ప్రకటించును. ఇట్లునటించక కాళిదాసు ప్రత్యక్షరూపమునరాజుతో ఓమహారాజా నీవు ద్యూతమాడగూడదు నిత్యముసభకు బొమ్ము అని బుద్ధులుసెప్పిన వినునా? లక్ష్యపెట్టునా? లేదు వినడు లక్ష్యపెట్టడు.

ప్రత్యక్షనీతులు పరోక్షనీతులవలె తగినపనిచేయజాలవు.

11. Set a thief to catch a thief-దొంగవానిట మంచముపేయుము.

దొంగనుపట్టుటకు దొంగను పెట్టుము అనగా దొంగవేషమువేయుము. టక్కరిమార్గములు త్రొక్కుము.

పత్రం పద్దు లేకుండ నమ్మకమునుబట్టి చేబదులుపుచ్చుకొని యెగగొట్టిన వారియూటాబుద్ధిని వెలికిదీసి బాకిని తీర్పించిన బుద్ధిశాలియొక్క కథ. ఇది జడ్జీలు, మునసపులు వకీళ్ళు వాదిప్రతివాదులుగానుండు వ్యాపారులందరు చదవదగినది. (వీరబలవినోదములలో నొక కథాసారము) నేతిపర్తకుడొకడు వీరబలుని కడకేగి తనకు మఱియొకవర్తకుడు 500 రూపాయలు బాకీయుండెననియు, అట్టిబదులు, పద్దు, పత్రములేకుండనమ్మకముమీద నిచ్చితిననియు దీర్చుమని యడిగినపుడు తనయొద్ద అసలు బదులేపుచ్చుకోలేదనుచున్నాడనియు మొఱవిడెను. అంత వీరబలుడు వానితో గొన్నిదినములోపి కపట్టియుండు మని చెప్పి పంపివేసెను. కొమ్మట వీరబలుడు నాల్గు నేతిడబ్బాలు తెప్పించి రెంటిలో జెరియొక మొహిరీ పడవైచి పైవాది ప్రతివాదులను మఱియిద్దఱువర్తకులను బిలిపించి మొహరీలువేసిన రెండుడబ్బాలను వాదిప్రతివాదులకును, మిగిలిన రెంటిని తక్కినవారి కిద్దరికి చెరియొకటినిచ్చి యమ్మిపెట్టితెచ్చిన వెలనిమ్మని చెప్పిపంపెను. వారుతమతమయిండ్లకుబోయి నేయితిరుగబోసి విక్రయించుచుండగ వాదిప్రతివాదులకు జెరియొకమొహిరి దొరికెను. అంతనా న్యాయబుద్ధిగల వాది తనకు లభించిన గ్రయధనమును దొరికినమొహిరీయునుగూడ దీసికొనిపోయి వీరబలునకిచ్చెను. కాని యానీచుడగు ప్రతివాది మొహిరీ తనకుమూరకిచ్చి దాచుమని సొమ్ముమాత్రమే వీరబలునకిచ్చెను. వీరబలుడు డబ్బాలలో నేయి 10 వీసెలకు నెక్కుడున్నదా తక్కువయున్నదాయని యడుగగ ప్రతివాది మణుగునేయి మాత్రమే యున్నదనియు దాను తూచుచుండ

గఁ దనకొడుకు దగ్గఱేయుంచెననియూఁ బలికెను. అంతట వీరబలుఁడేదియో యొకపని
మీఁద లోనికిఁబోయి "నీవు నీతండ్రిదాచనిచ్చిన మొహరీతీసుకొని రమ్మ"ని తన సేవకుని
ద్వారా ప్రతివాదికొడుకునకు వర్తమానమంపి మరల వెలుపలకువచ్చెను. కొంతసేపటికి
ప్రతివాదిపుత్రుఁడు రాఁగానే మొహరీ తెచ్చితివాయని యడుగఁగఁ దెచ్చితినని విన్నవిం
చెను. వీరబలుఁడు నీతండ్రి నీకు ఒక మొహరీ ఇచ్చియుండగా నీవొక్కటి కే యేల తెచ్చితి
వని ప్రశ్నింపనాతఁడు తండ్రివంకఁ దిరిగి డబ్బాలో నే తిరుగఁ బోయినపుడు ఒక
మొహరీయే నీవునాకిచ్చితివిగదాయనెను. అపుడు ప్రతివాదితెల్లబారి తప్పించుకొనుట
కుఁ జాలఁబ్రయత్నముచేసినను వ్యర్థమయ్యెను. ఇట్లు తండ్రీకొడుకుల సంవాదముచూ
చి, యొక్క మొహరీకే యసత్యమాడిన వాఁడు తప్పక యీ పెద్ద మొత్తమునకై యబద్ధ
మాడెనని తలఁచి ఘూటాకోరని రూఢి పరచుకొనెను. కొడుకుకూడా తండ్రితో నా
వర్తకునికి 500 రూపాయిలు తీర్చవలెనని చెప్పితివి కాదాయనఁదండ్రి విధిగా దానికి
నొప్పుకొనెను. వెంటనే వీరబలుఁడొక భటుఁ బ్రతివాది యింటికిం బంపి 500 రూపా
యిలు తెప్పించి వాని కిప్పించెను. వర్తకులు తమతమరాద్ధులను మీఁగగూడదనియు న
సత్యమాడ వలదనియు, బిడ్డలకు సత్యమునే నేర్పవలెననియు వీరబలుఁడు బోధించి స
త్యపరివర్తనుఁ డయిన యాకోమటిచిన్నవాని యోగ్యతకు మెచ్చి వానినాశీర్వదించి
పంపివేసెను.

## ఫలితార్థము.

సత్యము పలుకు. సత్యముపలుకు. సత్యమేతల్లి. సత్యమేతండ్రి. ఈకథలో అ
నాయాసముగా సత్యముపలికి కొడుకు యోగ్యుఁడనిపించుకొనెను. తండ్రిమిక్కిలి అ
యాసముతో తండ్రితప్పుకూతలుకూసి నీచుఁడనిపించుకొనెను. ఇప్పటి న్యాయసభలలో
నోట్లమీద తనఖాలమీద బదుళ్లిచ్చు మహాజనులారా? ఇప్పటి మీభాగ్యము పూర్వపు
వారికంటె దశ శత మడుంగులు హెచ్చినందుకు యోగ్యత సత్యవృత్తి హెచ్చవలెనా
లేదా? లేక పేచీలు, పేచీకోర్లు హెచ్చవలెనా? అనాగరము దానమాత్రకయగు నాశ ఈ
రెంటిలో సత్యవృత్తి ధర్మశీలత హృదయములందు నాటుకొనవలెను. కావలయునన్న చ
దువులు పాఠములన్నను సత్యవృత్తి హెచ్చవలయును డబ్బే ప్రధానమని యెంచక బి.
ఏ. పరీక్షలిచ్చి గౌనులువేసికొను వకీళ్ళు, ప్లీడర్ల సముఖములో, మంత్రిసాహెబులకడ చూ
లింత రాంభముతో మానప్రాణములను దాచనికీర్తి, చాలా కేసుల తరికీళ్ళు ఆయాపా

ట్లేలు వివరించునప్పుడు వారిని నడిపించుచు బుద్ధిచెప్పునట్టి యాబండీలు సత్యము బోధించిన యెడల మదరాసు రాజధానితాలూకు డిస్ట్రిక్టుమండలములలో కచేరీలు, ఖయిళ్ళు, న్యాయసభలును ఇంక పెరుగవు. సత్యమును బయలుచేయుటకు వీరబలుఁడు పయి కథలోపడిన యంతశ్రమపడ నక్కరలేదు.

## 111 కవీశ్వరుని భంగముచేసిన లోభివానికి తగినచికిత్స—

(వీరబలవినోదములలో నొకకథయొక్క సంగ్రహము.)

ధనార్జనకై యొక కవీశ్వరుఁడొక లోభియగు ధనవంతుని కడకేగి వానిని బొగడుచు వానిమీదఁ గొన్ని పద్యములు రచించి వానియెదుటం జదివెను. అంతనాలుబ్ధుఁడు కవీశ్వరునకేమియు బహుమానమీయకయే వానిని మాటలతో సంతోష పెట్టఁదలచి వానితో నీవు రేపు తిరిగివచ్చితివేని నీకు బహుమానమిచ్చెదనని చెప్పిపంపెను. కవీశ్వరుఁడును మిగుల సంతసించి మఱునాడు ధనికుని దర్శనముచేయఁగాఁ దానేమియు నెఱుగనివానివలెఁ గవీశ్వరునితో నీవెవరవు. ఇప్పటికేల వచ్చితివని లోభియడిగెను కవీశ్వరుడు తెల్లవోయి తత్పూర్వదినమున జరిగిన వృత్తాంతమంతయు నాలుబ్ధునికి జ్ఞాపకముచేయఁగా నీవు పద్యముచదివి సంతోషపెట్టితివి నిన్ను బహుమానించి పంపెదనని సంతోషపెట్టితిని. మాటకుమాటతీరి పోయెను. ఇదిగాక నిన్నటిది నిన్నటితోనే గతమయిపోయెను అనుచూ నాకవీశ్వరుని పొమ్మని శూన్యహస్తములతో నంపివేసెను.

ఒకనాఁడా కవీశ్వరుఁడు తనస్నేహితునితో నొకవీధిలో నాలోభియగు ధనికుని మోసము గురించి మాటలాడుచుండగా వీరబలుఁడా మార్గమునఁ బోవుచు నాసంభాషణ యాలకించి, జరిగినవృత్తాంతమంతయుఁ దెలిసికొని కవీశ్వరునకొక యుపాయము చెప్పి చెప్పెను. నీస్నేహితుని యాలోభివానియింటికిఁగొన్నిదినములు పంపుము. వారిద్దరికి పరిచయముహెచ్చి పరస్పరము స్నేహితులైన పిదప నాధనవంతుని నీస్నేహితుని నింటికి విందుకే సదని పిలిపింపుము ఆప్పుడచ్చటికి మన మిద్దఱము మారు వేషములతోఁ పోవుదము. ఆపిమ్మట చేయవలసినపని నేనుచేసెదను, అని చెప్పెను. ఆప్రకారమొకనాడు ధనికుడు విందుకుఁ బిలువఁబడెను. అచ్చటకుఁ గవియు వీరబలుఁడును మారువేషములతో బోయి లోభితో ముచ్చటలాడసాగిరి. గంటలకొప్పున కాలము గతించెను. కాని వారి సంభాషణమాత్రము తరుగనేలేదు. అంతనాధనికుడు తనను బిలిచిన యజమానితో

"ఏమీ యాలశ్యము. భోజనమునకు లేతువా" యని యడిగెను. అంతట యజమాని నిన్ను నేను విందుకుఁ బిలువలేదేయని మాఱుపలికెను. అంతటలోభి నన్ను విందుకుఁబిలువలేదాయని హెచ్చరింపగాఁ నాతఁడు "నీవు విందు నిజముగా చేసెదవనుకొంటివా. నిన్నూరకయేమాటలతో సంతోషపెట్టితి" వని ప్రత్యుత్తరము చెప్పగా వాలోభి నిశ్చేష్టుడయి తొయ్యబాఱెను. ఇదియొరిగియున్న వీరబలుఁ డాలోభితో ఛీ! వహావ్వా! నీవొకప్పుడిట్లే కవీశ్వరునికి సంభావనయేమియునియ్యక వట్టిమాటలు చెప్పి పంపితివిగా! యని రొత్తి పాడిచెను.

ఆయతిధియగు లోభికోపించి వీరబలుఁడని తెలియక నిన్నిట్లాక్షేపించుటకు నీ వెవ్వరవని యడిగెను.

అంత నీవీరబలుఁడు విజరూపము నొకేఁగించి గతించిన సంగతులన్నియు తెలిపి లోభిని చీవాట్లువేయగా సిగ్గుపడుచు లోకమునకు వెఱచి కవికిం గొంత సంభావనను ఇచ్చి పంపెను.

## ఫలితార్థము.

వాగ్దానముసేయునపుడది జరపగల శక్తియుండినచే చేయవలెను. లేనిచో చేయకుము. ఇప్పటిదినములలో ధర్మము నడపడములో మంచితెలివి యుండవలెను లేనిచో గొన్ని క్రొత్తయనర్ధములువాటిల్లును.

IV గొప్ప అపాయమునకు దివ్యమైన గొప్పయుపాయము పన్ని మహాబ్రిటానియావారికి బ్రిటీషు ఇండ్యారాష్ట్రముయొక్క పునాది అమర్చిన మహాపురుషుడగు క్లైవ్ కథ.

చరిత్రమందునుభూగోళశాస్త్రమందును నభిరుచి రోయుగని వారు దీనించదవి లిక్కుకి లక్కు' దృష్టాంతములలో నీచరిత్ర దృష్టాంతము ప్రశస్తమైనదని యూహింతురు.

మొగల్ చక్రవర్తి ఔరంగజేబు క్రీ. శ. 1707 సం॥న చనిపోగా సాంబ్రాజ్యలక్ష్మి యతనివారసులందుండక తొలగిపోయెను. రాజ్యము ఛిన్నభిన్నములయి బంగాళా హైదరాబాదు, ఆర్కాటుమొదలగు సంస్థానాధిపతులు అనపులేక స్వతంత్రులైరి.

చనిపోయినవానిపదవికి అనేకవారసులు బయలుదేరి ఎవనిమట్టుకువాడు తనకే రాజ్యము రావలెనని కలహించుచుండెను. కర్ణాటకనవాబు అన్వారుద్దీను తన రాజధానియగు ఆర్కాటునందు పరిపాలించుచుండగా చందా సాహెబు తానే దగ్గరవారసుడని ఫ్రెంచిగవర్నరు డుప్లెసహాయముతో ఆర్కాటును పట్టుకొని నవాబాయెను. పిమ్మట యుద్ధమందు అన్వారుద్దీను మరణించగా అతని కొడుకు మహమ్మదల్లీ తిర్చినాపల్లిలో దాగనందున ఫ్రెంచిసేనలతో ముట్టడించెను. డుప్లె హైదరాబాదు సంస్థానములో నాజరుజంగునకు పోటీవారైన ముజఫర్ జంగునకు సహాయముజేసి యాతని నైజాంగా జేసెను. అందుకై యాతడు గంజాం వగైరా 5 జిల్లాలను బహుమతిగా నిచ్చెను. ఇప్పుడు వింధ్య దక్షిణదేశమంతకు నిజముగ నధికారి తానేయని తనమహోన్నతి పదవిని దెలుపుటకై డుప్లెఫతెహాబాదు పట్టణమున, అనేకశిలాశాసనములతో కూడి స్తంభముస్థాపించెను

ఇట్లు ఫ్రెంచివారి సహాయమును దెలిసుకొని మహమ్మదల్లీ యింగ్లీషువారి సహాయము వేడెను. ఆప్రకారమువారు సహాయముచేసిరి. ఆంగ్లేయులు, ఫ్రాంసులు కోస్తావర్తకములకై యు కంపినీలుకట్టి స్వలాభమునకయి మనదేశములో వర్తకవ్యాపారము నడుపుచు ఒకరినొకరు ద్వేషించుచుండిరి.

మహమదల్లీ పట్ల ఆంగ్లేయులు చెల్లించనియెడల వారివర్తక స్థానములు పోవుటయే గాక ఇండ్యాలోని వర్తకవృత్తియు విడిపోవలసినంత యోగముబట్టెను. ఇట్టి యుపాయ మగ్నమునుండగ రాబర్టు క్లైవను బుద్ధిశాలి మబ్బుచాటునుండి వెలువడిన సూర్యునివలె బయలుదేరి సెంటుడేవిడ్ కోట గవర్నరుతో శికస్తుగా అకస్మికముగా అరాజకముగానున్న ఆర్కాటుకోటను స్వాధీన పరచుకొనవలయునని యు అంతగ తెలియగానె చందాసాహెబు తిరుచునాపల్లి ముట్టడించిన సేనలుకొన్నిటిని ఆర్కాటుకుపంపునని యు అందువలన మహమ్మదల్లీకి అపన్నివారణ మగునని యు జయమునకు నిది మంచి ఫిక్రియని యు జెప్పగా క్లైవునే రెండువందల సోల్జరులను మూడువందల శిపాయిలతోను పంపెను. వారిలో కష్టములు తప్పించినను ధైర్యశౌర్యములతో ఆర్కాటును పట్టుకొని ఇకరాగల భయంకరమగు ముట్టడిని నిర్బంటకు తగిన సన్నాహము చేయుచుండెను. ఇదివినగానే చందాసాహెబు తనకొడుకు రాజాసాహెబును పదివేలమంది సైన్యముతో తిరుచునాపల్లినుండి పంపెను. ఫ్రెంచి సేనలతో కలసిన యీ బలము ఆర్కాటును చుట్టువేసి 77 దినములు ముట్టడించియుండిరి. క్లైవుచూపిన సై

ద్యముగనకు సిపాయిలు సబట్జంగని బిరుదునిచ్చిరి. శత్రువులను చొరనీయక తనకొలది సేనకు తగిన భత్యము చాలని యిక్కట్టుసమయములో అరిష్టా నిష్టకష్టములకు తాళి శత్రుసేనలను చికాకుపరచుచుండగా 77వ దినమందు శత్రువులు కడపటి ప్రయత్నముచేసి కోటవారితో శక్యముగాక ముట్టడిని వదిలి పారిపోయిరి, ఆవెంటనె వారినివెంబడించి తరిమి తరిమి రొమ్మువిరిచినపుడల్లా జరిగినయుద్ధములలో నోడించి వారిని చెల్లాచెదరగొట్టెను. దారిలో తటస్థించిన డాంబికములగు డూప్లెసత్తాబాదును కొడి స్తంభమును చెరిపివేయించెను. తిరుచునాపల్లిలో మహారాష్ట్రులచేత చాందాసాహెబు చంపబడెను.

ఇంతవరకు క్లైవు యోచించిన ప్రక్రియను దానిని యొట్లునడిపించవలయునో అట్టియుపాయమును పురిగొని ఇంగ్లీషువారికి నీక్రిందిఫలములులభించెను. 1 మహమ్మదల్లీకి శత్రుపీడ నివర్తించెను. 2 రాజాసాహేబుసేనలు చెదిరిపోయెను. 3 ఫ్రెంచివారు చందాసాహేబును పరాజయమునొందిరి. 4 చందాసాహేబు చనిపోయెను. 5 ఇంగ్లీషు వారు ఆర్కాటు రాజధానిని మహమ్మదల్లి వశముచేసి నవాబుగా చేసిరి. 6 ఫ్రెంచివారియుశము బలము సామంతము తగ్గెను. క్లైవ్ యొక్క ప్రతాపము లోకవిదితమై దేవతాంశపు సేనాధిపతియని పిల్వబడెను. డూప్లె సంకల్పించిన జయములు క్లైవుసిద్ధింపజేసికొనెను. క్లయివు ఇండ్యాయందస్థితి సరిపడక రోగపీడితుడై ఆరోగ్యమునకై సీమకుంబోయెను. బాల్యమునుండి ఆతతాయియై తలిదండ్రులకు పీడయై విడిచిపోతే చాలునను కొన్న తలిదండ్రులు అతడిల్లు సేరగానే ప్రేమాతిశయముతో కౌగిలించుకొనిరి. ఇంగ్లండులో రాజును, కంపెనీవారును బంగారుపిడిగలకత్తిని బహుమతిచేసిరి. రెండు సంవత్సరములకు తర్వాతపోర్టుసెంటుడేవిడ్ గౌర్నరుగా నియమితుడై క్లయివు యీదేశమునకు మరలవచ్చెను. మూడవమారు బంగాళాగవర్నరుగా నియమితుడైవచ్చెను.

ఈరెండుమూడు సబున్నలో జయలక్ష్మియును రాజ్యలక్ష్మియును క్లయివ్ ప్రభువునకు పూర్తిగ ప్రసన్నముకాగా ప్లాసీయుద్ధములో బంగాళానవాబు సురాజాదౌలాను, పేరునకు డిల్లీచక్రవర్తియని పిల్వబడుచున్న షాఅలమును బక్సారుయుద్ధములోను, అవుడ్ నవాబు సుజాదౌలానుకోరాయుద్ధములోను, 1764 లోను బూర్తిగ నోడించెను. వేరదిక్కులేక కడపటి యిద్దరింగ్లీషువారి శరణమువేడిరి.

ఆ 1765 సం॥ న చక్రవర్తి ప్రత్యాసక్తిగ యధావిధిగ దివానియను నొక పట్టాను క్లయివునకు వ్రాసియిచ్చెను. అందువలన బంగాళా బేహారు, ఓరిస్సానీమల (దివిస్యూ)

శిస్తును వసూలుచేయు నధికార మింగ్లీషువారికి నిచ్చెను. అందుకు ప్రతిఫలముగానే సం॥కు 26 లక్షల రూపాయల నింగ్లీషువారు చక్రవర్తికి నిచ్చుటకు క్లయివు అంగీకరించెను. సుజాఉద్దౌలాకు అవుధు పరగణా నిచ్చి క్లయివు సరసమైన సంధిచేసెను.

ఇదిరా డిల్లీ రాజ్యలక్ష్మి మొగలాయి వంశమునుండి గ్రేటు బ్రిటానియా జాతి వారినిపొందిన ప్రత్యక్షనిదర్శనము. ఇదియె మహాపురుషుడైన క్లయివుయొక్క అర్కాటుముట్టడి ఫక్కీయొక్క పరమావధి.

## ఫలితార్థము.

ఫక్కీని పన్నుటలో బుద్ధిచాతుర్యము, పట్టుదల, దూరదృష్టి, దూరశ్రవణగుణము, శాంతము మొదలగు గుణములు ఇమిడియున్నవి. పట్టిచములు ప్రధానసాధనములు కావు.

మహాధైర్యశాలియు, దైవానుకూలుండును నగు క్లయివు వ్యవహారరూపమగు పుస్తకమును నిత్యనైమిత్తిక బాధల తరుణోపాయములను విషయములను చింతనజేసి యీవిషయములలో నగ్రగణ్యుండాయెను.

## V కక్కురాటుకు చెప్పుదెబ్బ.

'ఏమయినా యిచ్చెదను' అనునొకకథ వీరబల వినోదములలోనిది. దానివెనుక సంక్షేపముగ వ్రాయడమయినది. ఢిల్లీలో నొకానొకగృహస్థుం డొకవాడు మంగలివాని నిలిచి నీకేమైనా యిచ్చెదను క్షవరము చేయుమనెను. ఆప్రకారము తలపని చేయగా వాడాతం డొక పీటనీయబోయెను. నాకు ఏమయినా యిచ్చెదమని చేయుచ్చుట న్యాయము ఏమైనా యుండనిప్రార్థించెను. ఏమైనా అనేది వేరేవస్తువుగా నుండునా యని పావలా, అర్ధ, తుదకు రూపాయి ఇయ్యఁబోయెను. నాకు ఏమైనా కావలెనే గాని రూపాయి వలదని తుదకు చక్రవర్తియగు అక్బరు పాదుషా యెదుట ఫిర్యాదు చేసెను. రాజు వీరబలుని విచారించుమనెను. వీరబలుఁడు మంగలిని మధ్యాహ్నము రమ్మనెను. ఆప్రకారము రాగా—

వీరబలుఁడు—(మంగలితో) నీకేమిచ్చెదనన్నాఁడు? నిజముచెప్పు.

మంగలివాఁడు—ఏమైనా ఇచ్చెదనన్నాఁడు.

వీరబలుఁడు— నీకు ఏమైనా ఇవ్వలేదుగా? నీకెంతధనమిచ్చినను పుచ్చుకొనవు. అదే తెమ్మను.

మంగలి—ధనము నాకెందుకు? నా యింటను ధనముగలదు. ఏమైనా నాకు కావలెను.

వీరబలుఁడు—ఓ మంగలి నీకు వేటాడుట చేతనౌనా?

మంగలి—అయ్యా! నేను వేటాడలేను, కాబట్టియే ఈ నీచజీవనము చేయుచున్నాను.

వీరబలుడు—సరేకాని ఓరీ నీవు ఎప్పుడైనా ఒంటరిగా నేయూరైనా వెళ్ళినావా?

మంగలి—చాలామాట్లు వెళ్ళియున్నాను.

వీరబలుఁడు—మనపట్టణ సమీపముననున్న పర్వతగుహాలోనికి రాత్రి యొంటరిగా వెళ్ళి రాగలవురా?

మంగలి—అయ్యబాబో! అందులో ఏమైనాయుంటె నాకు ప్రాణాపాయము కాదా!

వీరబలుడు—ఓ మంగలి! సరే అందులో నీకు కోరికే యేమైనా ఇప్పటి క్షవరములకు ప్రతిఫలముగా పుచ్చుకొనుము. ఇదే కోరితివిగా.

మంగలి ఆమాటలువిని నోరాడక శవమువలె వెల్లబారెను. వీనిపని తన్నుగట్ట తాఁడు తాఁదెచ్చుకొన్నట్టాయెను.

వీరబలుఁడు—మంగలి! పో పో నీకిదే తగినదండు. నీకు చేతికివచ్చిన రూపాయి ప్రాప్తము లేదు.

ఈకథ చదివినవారికి మంగలివాని తుంటరిబుద్ధి అజ్ఞానము, మొండితనము వెల్లడియగును. తీర్పరియైన వీరబలుఁడు పట్టుదలతో అదేమైనాను తెచ్చుకొమ్మని రాజభటులచేత పర్వతగుహాలోనికి గెంటించినయెడల పాపము పోవుటయేగాక మరణముగూడ వానికి సంభవించును.

## ఫలితార్థము.

మొరటుతనముచేత తనస్వలాభము చూచుకొనక పరులక్షేమము విచారింపక వృథాగా పరులకు నపాయముచేయ తలపడినవాని సత్త్రావాత మంగలివాని ప్రారబ్ధమువలె కుక్కకాటుకు చెప్పుదెబ్బగనుండును.

VI ఖరారు (అనగా వాగ్దానము) ను తప్పించుకొనుటకు బనాయించిన (లిక్కికి లక్కి) కు యుక్తికి ప్రతియుక్తి. చోద్యమయినది.

(బీరబల వినోదములలో నొకదానియొక్క సంక్షేపము.)

అక్బరను చక్రవర్తి ఢిల్లి రాజ్యమేలుచు నలి హెచ్చుగనుండు శీతకాలములలో నొకరాత్రి నాలుగు జాములు నీటను నానుచున్న బ్రాహ్మణునికి 5000 ల రూపాయలు బహుమాన మిచ్చెదనని చాటింపించెను. అదివిని 70 యేండ్ల వృద్ధబ్రాహ్మణుం డందు కంగీకరించి రాజభవనపరిముఖమున నీటనిల్చి మరునాడు కోటకునకు రాజసన్నిధానము పోగా రాజు నీవెట్లుండ గలిగితివని యడిగెను. అంత నామసలి బ్రాహ్మణుండు కోటలో దీపపువెలుగు చూచుచు నుంటినని విన్నవించెను. దీపపు వేడివలన నీవుండగలిగితివిగా, గాన నీకు ధనమీయను పొమ్మనెను. ఇట్లుండ కొంతకాలమునకు నక్బరు బీరబలునకు యుద్ధమునకు బోవలసియున్నదని వార్తపంపగా నత్తెసరు పెట్టుకొని భుజించివచ్చెదనని చెప్పి రాజుబోవు దారిలో ముందుగ కొంతదూరముపోయి యొకగెడ పాతి దానిచివర బియ్యపుకుండగట్టి నూటిగ దానిక్రింద మంటజేయుచుండెను. అక్బరు కొంతసేపు వేచి తనకుతానే బయలుదేరి బోవుచుండ దారిలో బీరబలుడు గాన్పించెను. బీరబలుడు చేయుపనికి హేళనజేయగా నతడు తమకోటలో దీపపువెలుగు నీటిలో నున్న బ్రాహ్మణున కెట్లువేడిగలిగించెనో యట్లే నేను క్రింద మంటచేయుచున్న మంటవేడిమి తగిలి మీదనున్న బియ్యము ఉడుకునని చెప్పగా చక్రవర్తి సిగ్గుపడి యాబ్రాహ్మణుని బిలిపించి 5000 రూపాయలనిచ్చి తననింద బాపుకొనెను.

VII బ్రాహ్మణమంత్రిని తీసివేయుటను బ్రాహ్మణేతరులు పన్నిన యుపాయమునకు నత్యద్భుతోపాయము.

అక్బరు చక్రవర్తి ఢిల్లీని పాలించుచున్నపుడు వీరబలుడను బ్రాహ్మణమంత్రియొక్క బుద్ధికుశలతకు నోర్వలేక రాజబంధువులు హుమ్రావులు కట్టుకట్టి ఒకనాడు తాన్‌సేనను దివ్యగాయకునిచేత పాడించి మెప్పించి తాన్‌సేను వీరబలునికంటె నధిక విద్వాంసుడు గాన వీరబలునకు బదులుగా మంత్రిపదమున తాన్‌సేనుని నియమించుడని ముష్తాజుద్దీన్ మొదలగు హుమ్రావు లొక్కపెట్టున శిఫార్సు చేసిరి. దృష్టాంత పూర్వకముగ వారి మూర్ఖపుపట్టును వదల్చుటకై రాజొకనాడు తాన్‌సేనను వీరబలుని బిలిచి యొక జాబు బర్మాచక్రవర్తికి వ్రాసి వారికిచ్చి దానికి ప్రత్యుత్తరము తెమ్మనెను. వారిద్దరు ఏదియో యొకరహస్యకృతమయిన నేరము జరిగించినారు గనుక వారిని వురితీయించుడని కోరి ఆజాబులో వ్రాసెను. అదితీసికొనిపోయి వీరబలుడు బర్మారాజు కిచ్చెను. అది చూడగానే యారాజు తాన్‌సేనుకిచ్చెను. అతడు చదివి యందేదోవింత యున్నదని వారము దినములు వ్యవధియిమ్మనెను. అంతవరకు వారిద్దరిని జేడీలతో బంధించి చెరలో నుంచిరి.

తన సంగీతపాటకు మెచ్చి బహుమతులందుకునని కాచుకొనియున్న తాన్‌సేనుడు మిక్కిలి వెఱచి వీరబలునితో నీయుపాయమునకుంగి యుపాయముపన్ని బ్రతికింపుమని వేడెను తామిద్దరిబుద్ధిబలము శోధించుటకై యక్బరేదో పన్నాగముపన్నెనని వీరబలు డూహించెను. మరణమేకటస్థమైతే యెట్లు తప్పించుకొనవలెనో యోచించుచు వారముదినములుకాగానే మనలను వురిదీయుటకు వెడల మనమిద్దరము నన్నే ముందువురితీయుడని నేనును, నన్నే ముందరనని నీవును మొగబెట్టుచు నొప్పులాడవలయునని పక్కా కల్పించెను. వారము దినములయినపిమ్మట వీరబలుడన్నప్రకారము జరిగెను. భటులు ఖైదీల పెనుగులాట చూచి వారికి పిచ్చియెత్తెనని రాజుతో మనవిచేసెను. ఇదేమనుచు ఖైదీలను రాజడుగగ మేము చెప్పమనెను. అట్లనేకొలది రాజు పట్టుపట్టి హేతువు చెప్పుమనెను. ఇట్టి హేతువే వీరబలుడు పన్నిన అద్భుతోపాయమగు లక్కి- మారాజు చాలాకాలమునుండి బర్మాదేశమును జయింపవలెననుచు నోచించియోచించి యుపాయముగానక ఆస్థానప్రధాన జ్యోతిష్కులను సలహాయడిగెను. బర్మాకు మీరుపంపెడు ఇద్దరు మనుష్యులను బర్మాచక్రవర్తి చంపించినయెడల వారిజన్మాంతరమున మొదటివాడు బర్మాకురాజును, రెండవవాడు మంత్రియగును. ఈరీతిగ బర్మాజయముసిద్ధియగునని జ్యోతిష్కులందరును చెప్పెను. మారాజు ఉద్దేశ్యము నెరవేరుటకై మమ్ములను ఇట్లుపంపెను. మేమిదంతయు మీకు చెప్పినట్లు మారాజు తెలిసినయెడల మమ్ములను తప్పక చంపును. కనుక తమరే చంపించుడని మొఱపెట్టెను. ఢిల్లీరాజింతదుర్మా

ర్గుడాయని కంగారయి బర్మారాజు వారిద్దరిని యవ్యవధానముగా తమ రాజ్యహద్దులలో చావకుండ ఢిల్లీకి తననౌకర్లతో పంపెను. ఇట్లు తాన్ సేనువీరబలుడు ఢిల్లీచేరగా నిండో లగమున? మహమ్మదీయ ప్రముఖులను ఉద్యోగస్థులను రావించిజరిగినవృత్తాంతము అక్బరు వినిపించుమనెను. అంత తాన్ సేను మహారాజా! ఈవీరబలుని బుద్ధిచాతుర్యము వలననే మేము బ్రతికి సురక్షితముగ ఇల్లుచేరితిమనెను. కథంతయువిని అక్బరు హిందువుల మహమ్మదీయులకేసిచూచి వీరబలుని బుద్ధికుశలత శోధించుటకై నేనీపన్నాగము లిక్కగ పన్నితి. తాన్ సేను పాటకుడే కావచ్చును. మంత్రిత్వమునకు తగడు. హిందువులపై యనూయ మీకుతగదు. మీరుభయులు నాప్రజలు సోదరభావముతో సంచరింపవలయువారు. మీలోమీరు ద్వేషించుకొంటిరా నేను సహింపజాలను. అనుచు వారలను బెదరించి బుద్ధిచెప్పెను.

VIII ఉన్నమాటంటె యులుకెక్కువ.

'బోనిలో పంది. అడవిలో దేవుడు.'

ఇందు మొదటిది లిక్క- రెండవది లక్క.

వీరబలుని కుశాగ్రబుద్ధికయి అక్బరుమెచ్చుకొనుచు, పూజించుటయును ఒక్కొక పుడోర్వలేమిచే ద్వేషించుటయును గలదు.

ఒకప్పుడు మంత్రివవమానపర్చవలెనని చక్రవర్తి గదిలో నొకమనబోనులో నొకపందినుంచి దానిం దెచ్చి యుమ్మనెను. చేతితో నాపలమందుకొనగా నామర చేతి నపట్టుకొనెను. రెండవచేతితో పట్టు విడిపించుకొనబోగా రెండవచేతింగూడ బట్టుకొనెను. అందుచేత రాజు చమత్కారముగా వీరబలునితో గదిలో సామానులు రోజూ పోవుచున్నవి. చోరుడు దొరకుటలేదు నేటికిందొరికినావు కాని దయతో నేటికి విడుచుచున్నాను ఇక యిట్టిచోరత్వము జేయకు మనుము బోనులోచిక్కుకున్న జేతులను వదలెను. వీరబలుడు సిగ్గువలన చిన్నకయుండెను.

నాటితుద మొదలు సభలో చూచినపుడల్లా 'బోనిలో పంది.'

అనుచు వీరబలుని యదలకించుచుండెను. అతనికి నులుకెక్కునై యీవెక్కిరింత జాడ్యమునకు తగినమందుకై యోచించియోచించి జగన్నాథ యాత్రకై 2 నెలలు సెలవు